# ANDHRA SREEBHASHYA.

# ఆంధ్ర శ్రీభాష్యము.

భగవద్రామానుజాచార్యులవారిచే
బోధాయనవృత్త్యనుసారముగా రచియింపఁబడిన
బ్రహ్మసూత్రభాష్యము.

హానరెబిల్ శ్రీ రాజా గోడె నారాయణగజపతిరాయనింగారి

సెలవుప్రకారము

శ్రీపరవస్తు శ్రీనివాసజగన్నాథస్వామి అయ్యవారలుగారిచేఁ
తెనుఁగు సేయఁబడి

వారి సెలవుప్రకారమె

ముద్రింపఁబడినది.

౩ సంచిక.

PUBLISHED BY

Sree Paravastu Sreenivasa Jagannadhaswami Ayyavaralugaru.

Printed by N. Subbarow at the Arsha Press

Vizagapatam, 1890.

యున్నది, అను వ్యవహారమునకును స్వయముగానే హేతువు.

౭౮. ఇట్లు స్వయంప్రకాశమైన యనుభూతి (జ్ఞానము) నిత్యమైనదియునగును- ప్రాగభావాదులు లేకపోవుట యందుకు హేతువు- (ప్రాగభావమనఁగా ఒకవస్తువు పుట్టకముందు ఆవస్తువు లేకపోవుట) ఆప్రాగభావము లేకపోవుట స్వతస్సిద్ధమగుటనే- స్వతస్సిద్ధమైన యనుభూతికి (జ్ఞానమునకు) ప్రాగభావము తనంతనుగాని మఱియొకదానివలనఁగాని తెలియశక్యముకాదుగదా- తనయభావమును తెలియఁజేయునదేది యనుభూతి, సత్తు (ఉన్నది) అగుచుఁదెలియఁజేయదు- అది యుండఁగా విరోధమువలననే దానియభావము లేకపోఁగా ఇఁకనది తనయభావమును తెలియఁజేయుటయెట్లు? అనుభూతి లేనిదేయయిన యెడను లేనిదగుతానుతనయభావమునదెట్లు ప్రమాణమగును. అనుభూతి మఱియొకదానికి విషయముకాదు గాన మఱియొకదానివలన తెలియశక్యంబునుకాదు- ఈ అనుభూతికి ప్రాగభావమును సాధింపవలసినప్రమాణము ఈ అనుభూతి అని అనుభూతిని విషయముగాఁజేసికొనికదా దానియభావమును సాధింపవలయును- ఇదిస్వతస్సిద్ధమగుటను విషయీకరింపఁబడుట కవకాశము లేదుగాన దీని ప్రాగభావము మఱియొకదానివలన తెలియశక్యమైనదికాదు- ఇందువలనదీనికిప్రాగభావము లేమగాన నుత్పత్తి (పుట్టుక) కలదనశక్యముకాదు- కావుననుత్పత్తిననుసరించియుండెడి మిగిలిన భావవికారములుగూడదానికిలేవు (పుట్టుకకలవస్తువులకెల్ల ఆఱుభావవికారంబులుండును- ౧జన్మము అనఁగా పుట్టుక- ౨సత్తా- అనఁగా ఉనికి- ౩పరిణామము అనఁగా పరిణమించుట- ౪వృద్ధి అనఁగా ఎదుగుట- ౫అపక్షయము అనఁగా తగ్గుట- ౬వినాశము అనఁగా నశించుట-)

౭౯. పుట్టుకలేని యీయనుభూతి (జ్ఞానము) తాను అనేకములగుటను సహింపదు- అనేకములయి యుండువానికి నియతములగుధర్మములకంటె విరుద్ధములైన ధర్మములు కనఁబడుటయందుకు హేతువు- (అనఁగా అనేకములయియుండెడి ఘటపటాదులయందు తప్పక కలిగియున్న పుట్టుకకువిరుద్ధమైనపుట్టుకలేకపోవుట, ఈయనుభూతియందుండుటవలననను టు-) పుట్టనిదిఅనేకములైయుండుట కనఁబడనేదు- భేదము

~~మొదలగునవి~~ తను భవింపఁబడునవిగాన రూపాదులయట్లు అనుభవధర్మములగుట సంభవింపదు.

౮౦. కాఁబట్టి అనుభూతి అనుభవించుట స్వరూపముగాఁగల దిగాన అనుభవింపఁబడవలసిన ధర్మము మఱియేదియుం గూడదీనికి ధర్మముకాఁగూడదు.

౮౧. ఈజ్ఞానము భేదములన్నియు లేనిదిగానదీనిస్వరూపము కంటెనతిరిక్తుఁడై దీనికిఆధారమగుజ్ఞాత(తెలిసికొనువాఁడు)రెండవాఁడు లేఁడుగాన స్వయంప్రకాశమైన అజ్ఞానమె ఆత్మ-అదిజడముకాదుగాన ఆత్మకానిదానియందు నియతమైన జడత్వము,సంవిత్తు(జ్ఞానము)నందులేనిదై ఆత్మగాకపోవుటనుగూడ మఱలింపుచున్నది-

౮౨. నేనుతెలిసికొనుచున్నాను అని జ్ఞాతృత్వము (తెలిసికొనువాఁడగుట), ప్రతీతివలన (తోఁచుటవలన) సిద్ధింపుచున్నదేయన్నను- అట్లుకాదు-(అవభ్రాం)తి-ముత్యపుచిప్పను చూచి వెండియనుకొనినట్లు -అనుభూతికి లనమెడను కర్తృత్వము సరిపడదుగదా-ఇందువలన నేనుమనుష్యుఁడనని మిక్కిలి నెలుపలదియైన మనుష్యత్వముతోఁగూడినపిండము సంఘాతమునందు)ఆత్మాభిమానము (ఆత్మయనెడిభ్రాంతి)వలెనే జ్ఞాత(తెలిసికొనువాఁడు)యనుకొనుటయును అధ్యాసమె(భ్రాంతియె)- జ్ఞాతృత్వమనునది జ్ఞానమనెడి వ్యాపారమునకుఁగర్తయగుటకదా- అదివికారస్వరూపమగుటను జడమైనది-అదివికరించెడి ద్రవ్యమైన(వస్తువైన) అహంకారమునందున్నది- వికారములు లేనిసాక్షియగు చిన్మాత్రమైన ఆత్మయందు ఎట్లు సంభవించును? కాఁబట్టి జ్ఞానమునకు ఆధీనమైన సిద్ధిగలదగుటను రూపాదులయట్లు కర్తృత్వము మొదలగునది గూడనాత్మధర్మము కాదు-

౮౩. నిద్ర,మూర్ఛ మొదలగువానియందు అహమ్(నేను) అనెడి జ్ఞానము లేకపోయినను ఆత్మజ్ఞానముకనఁబడుచున్నదిగాన ఆత్మ అహమ్(నేను) అనెడిజ్ఞానముచేఁదెలియఁబడఁడు-ఆత్మకుకర్తృత్వమునను, అహమ్(నేను)అనెడి జ్ఞానమునకు విషయమగుటనును, అంగీకరించినయెడను, దేహమువలె జడమగుటయు, పరాక్కు(ప్రత్యక్కు-కానిది)అగుటయు,ఆత్మకాకపోవుటయు మొదలగునవి పరిశీలించుటతప్ప

డు-అహమ్(నేను)అనెడి జ్ఞానమునకు విషయమైనకర్తగా ప్రసిద్ధమైన దేహముకంటె, ఆదేహముయొక్క క్రియలకు ఫలములగుస్వర్గాదులననుభవించెడిభోక్త(ఆత్మ)వేఱగుట ప్రామాణికులకు ప్రసిద్ధమైనదే-అట్లే అహమ్అనుదానిచేఁజెప్పఁబడెడి జ్ఞాతకంటె విలక్షణుఁడైనసాక్షియె ప్రత్యగాత్మ(జీవుఁడు)యని తెలిసికొనవలసినది-

౮౪. ఇట్లు వికారములు లేక యనుభవమె స్వరూపముగాఁగలవాఁడగునాత్మకు అభివ్యంజకము(తెలియఁజేయునది)అయినయహంకారము, జడమైనను తనయందున్నవానిగా నాత్మను తెలియఁజేయుచున్నది- అభివ్యంజకములన్నియు, తమచేనభివ్యంగ్యములు(తెలియఁజేయఁబడునవి)అగువానిని తమయందున్నవానిగా అభివ్యంజనముచేయుట (తెలియఁజేయుట) స్వభావము- అద్దము,నీరు,మొదలగునది ముఖము చంద్రబింబము మొదలగుదానిని తనయందున్నట్లు తెలియఁజేయును-ఇట్లు మొండి గోవు గోత్వము(గోవగుట)అనెడిజాతిని తనయందున్నట్లు తెలియఁజేయును. దానివలనవచ్చినదె నేను తెలిసికొనుచున్నాననెడిభ్రమము- స్వయంప్రకాశమగు అనుభూతికి(జ్ఞానమునకు)ఆయనుభూతిచేఁ దెలియఁజేయఁబడవలసినదై జడరూపమగు నహంకారముచేనభివ్యంగ్యత్వము(తెలియఁజేయఁబడునదియగుట) ఎట్లు ? అని శంకింపఁజనదు- సూర్యకిరణములచేతఁదెలియఁజేయఁబడెడి చేయి, సూర్యకిరణములను తెలియఁజేయునదియగుట కానఁబడుచున్నదిగదా- జాలరంధ్రములోనుండి బయలువెడలిన సూర్యకిరణములు దానిచేఁదెలియఁజేయఁబడెడి చేయిచేతనె మిక్కిలిస్ఫుటముగాఁదెల్పఁబడుట కానఁబడుచున్నదిగదా యనుట-

౮౫. నేను తెలిసికొనుచున్నాఁడను అనెడిజ్ఞానమైన అహమ్ అనుదానియర్థము జ్ఞానమాత్రమె అయినయాత్మకు సత్యమైనస్వము కాదుగాన నిద్రయందును మోక్షమందును అనువర్తింపదు-దానిలో అహమ్ అనుదానియర్థము భాసించుట లేకపోవుటను స్వభావసిద్ధమైన అనుభవమాత్రరూపముననె ఆత్మ తెలియఁబడుచున్నాఁడు- కావుననే నిద్రపోయిలేచినవాఁడు ఒకొక్కప్పుడు నన్నుగూడ నేనెఱుంగనంటిననుకొనుచున్నాఁడు-

౪౯- కాఁబట్టి పరమార్థముగా భేదవికల్పములన్నియు లేనిదై నిర్విశేషమై చిన్మాత్రమై యేకరసమై (జ్ఞానమొకటియె స్వరూపముగాఁగలదై),కూటస్థమైయుండెడి సంవిత్తే(జ్ఞానమే)భ్రాంతిచేత జ్ఞాత (తెలిసికొనువాఁడు) అనియు జ్ఞేయము (తెలియఁబడునది) అనియు, జ్ఞానము (తెలిసికొనుట) అనియు, ననేకవిధములును విచిత్రములునగు భేదములుకలదై భ్రమింపుచున్నది- దానికిమూలమగు నవిద్యనుపోఁగొట్టుటకు నిత్యంబును పరిశుద్ధంబును జ్ఞానస్వరూపంబును ముక్తస్వభావంబును (సంసారసంపర్కములేని స్వభావముకలదియు ను) అగు బ్రహ్మంబును ఆత్మయును ఒక్కటియె అనెడివిద్యను తెలిసికొనుటకై వేదాంతములన్నియును ఆరంభింపఁబడుచున్నవి-

మహాసిద్ధాంతము-

౧. ఇది, ఉపనిషత్ప్రతిపాద్యుఁడగు పరమపురుషుఁడు వరింపఁదగిన గుణవిశేషములు లేనివారును,అనాదియగు పాపవాసనచేఁ జెడఁగొట్టఁబడినబుద్ధియంతయుఁగలవారును,పదములు వాక్యములువానియర్థములునువీనియథార్థస్థితి నెఱుఁగనివారును,ప్రత్యక్షము మొదలుగాఁగలప్రమాణములన్నిటియొక్కయును స్వభావములు దానిసామగ్రి మొదలగుదానినెఱుంగుటయనెడి సుందరన్యాయమార్గము లేనివారును,అగువారిచే,విమర్శమునకు నిలువని యనేకవికల్పములగు కుయుక్తులచేఁ గల్పింపఁబడినది-కాఁబట్టి న్యాయసహాయముగల ప్రత్యక్షాదిప్రమాణముల యథార్థస్థితినెఱిఁగిన వారిచే నాదరింపఁబడఁదగినది కాదు-

౨. అదియెట్లన్నను-విశేషములు లేనివస్తువును వాదించువారు ఆట్టివస్తువునుగూర్చి యియ్యది ప్రమాణము అని చెప్పుటకు శక్యముకాదు- ప్రమాణములన్నియు విశేషములతోఁగూడినవస్తువులె విషయములుగాఁగలవి-వారియనుభవమునను తెలియుననివారిగోష్ఠిలోఁ జెప్పుకొనియెడి యనుభవముకూడ నాత్మసాక్షికమగుటను (ఆత్మసాక్షిగాఁగలదియగుటను)సవిశేషమె- దీనిని నేనుచూచితిని అనియెద్దియో యొకవిశేషముతోఁగూడినదియె యన్నియనుభవములలోనను విషయమగును- సవిశేషముగా ననుభవింపఁబడుచున్న యనుభవంబును, ఏదైననొకఁడు యుక్తిచేత నిర్విశేషమని సాధింపఁబడునెడను దానియందుండెడి ధర్మములంబట్టి

యె సాధింపఁబడవలయునుగాన ఆ సాధకములగు ధర్మములంబట్టియె సవిశేషమగును-కాఁబట్టి కొన్నివిశేషములతోఁగూడినదానికె మఱికొన్ని విశేషములులేవని నిరాకరింపఁబడుచుండునుగాన ఎచ్చటనును నిర్విశేషమగు వస్తువు సిద్ధింపదు-బుద్ధికి బుద్ధిత్వంబును (బుద్ధియందుండెడి జాతియును), స్వప్రకాశత్వంబును(తనంతనె తెలియఁబడుటయును), అనెడి విశేషములుకలవు- తెలిసికొనువానికి తెలివియనునది విషయములను తెలియఁజేయుట యనెడి స్వభావముకలదిగానె తెలియఁబడుచున్నది- నిద్రయందును, మత్తెక్కినప్పుడును, మూర్ఛ(సొమ్మసిల్లుట) యందునుగూడ ననుభవము సవిశేషమైయె యుండునని వానివానిపట్టుల నిరూపించెదము- మీరు అంగీకరించినవి నిత్యత్వము మొదలగునవిగూడ ననేకవిశేషములుండనేయున్నవి- అవివస్తుమాత్రమెయని యుపపాదింపశక్యముకానివి-వస్తుమాత్రము నంగీకరించినను ప్రకారభేదములంబట్టి వివాదములు కనఁబడుచున్నవి- తనకుఇష్టమైనవిధములచేతనె తనమతము సాధింపఁబడుచుండును- కాఁబట్టి ప్రమాణసిద్ధములైన విశేషములతోఁగూడినదియె వస్తువని చెప్పవలసినది-

౩. శబ్దప్రమాణము ముఖ్యముగా విశేషములతోఁగూడిన వస్తువునె చెప్పెడిసామర్థ్యముకలది- అదిపదరూపముగానును వాక్యరూపముగానును ప్రవర్తించును-ప్రకృతియును ప్రత్యయంబునుకలిసినంగదా పదము-ప్రకృతికిని(Base)ప్రత్యయంబునకును(Termination) అర్థములువేఱుగానపదమెవిశిష్టమైనయనఁగా కొన్నిధర్మములతోఁగూడినయర్థముప్రతిపాదించుననుట తప్పనిది- పదములువేఱగుటగూడనర్థములవేఱగుటనే- పదములసముదాయమైనవాక్యమునేకపదార్థముల సంబంధవిశేషమును జెప్పునదిగాన నిర్విశేష వస్తువును ప్రతిపాదించెడి సామర్థ్యము లేదుగాన నిర్విశేష వస్తువుంగూర్చి శబ్దము ప్రమాణముకాదు-

౪. నిర్వికల్పకమనియును సవికల్పకమనియును రెండువిధములైన ప్రత్యక్షముకూడ నిర్విశేషవస్తువుంగూర్చి ప్రమాణమగుటలేదు- (ఒకరివస్తువును చూచినతోడనే అదియేమివస్తువో తెలియకవస్తువుమా

త్రము కనఁబడును. అది నిర్వికల్పకప్రత్యక్షము. అటుపైని అది నల్లనిది తెల్లనిది కుండ అని యిట్లు దానిధర్మములన్నిటితోడను తెలియఁబడును. అది సవికల్పకము. అందు సవికల్పక ప్రత్యక్షమున జాతి మొదలగు ననేకపదార్థములతోఁ గూడినదియె విషయమగుటను అది సవిశేషవిషయము, అనఁగా విశేషములతోఁ గూడినదియె విషయముగాఁ గలది.

౫. నిర్వికల్పకముగూడ సవిశేషవిషయమె. నిర్వికల్పకమునఁ దెలియఁబడిన పదార్థమె కదా సవికల్పకమునఁ దెలియఁబడును. నిర్వికల్పకమనఁగా ఏదియో యొక్క విశేషము లేనిదానిని గ్రహించుట గాని విశేషములన్నియు లేనిదానిని గ్రహించుట గాదు. అట్టి దానిని గ్రహించుటయెప్పుడును కనఁబడుట లేదు. అట్లు కనఁబడుటకు సంభవము కూడ లేదు. ప్రతిజ్ఞానంబును ఇది, ఇట్లు, అని ఏదియో యొక్క విశేషముతోఁ గూడిన వస్తువుంగూర్చియె పుట్టుచున్నది. ముక్కోణముగా నుండునది (గోవుముఖము), సాస్న అనఁగా గంగడోలు, మొదలగు నాకారవిశేషములు లేక వస్తువును గ్రహింపఁబడుట సరిపడదు.

౬. కాఁబట్టి నిర్వికల్పకమనఁగా ఒక్క విషయమున నొకప్పుడు పుట్టిన జ్ఞానములలో మొట్టమొదట ఆవస్తువుంగూర్చి పుట్టిన జ్ఞానము. ఆ వెనుకఁ బుట్టెడి జ్ఞానములన్నియు సవికల్పకములు (ఒక్క వస్తువునేమన మొక్క గడియవఱకుఁ జూచుచున్నను అది యొక్కటియె జ్ఞానము కాదు. అది ఆ విషయమున పుట్టిన జ్ఞానముల వరుస. ఒక్క జ్ఞానము అతిస్వల్పకాలము వఱకె యుండును. అని శాస్త్రజ్ఞులందఱు నొప్పుకొందురు). రెండవది మొదలగు పిండగ్రహణములు (ఆవస్తువునుగూర్చిన జ్ఞానములు) సవికల్పములు. అందు మొదటి పిండగ్రహణమున గోత్వము (గోవు అగుట) మొదలగువాని యొక్క అనువృత్తాకారత్వము తెలియఁబడదు (అనువర్తించిన యాకారము కలవగుటయనఁగా మొదట తెలియఁబడినవె రెండియు తెలియఁబడుచున్నవని తోఁచుట). రెండవది మొదలగు పిండగ్రహణములయందె అనువృత్తి (అనువర్తించుట) తెలియఁబడును. మొదటి జ్ఞానమున తెలియఁబడిన వస్తుసంస్థాన రూపమైన (వస్త్వాకారరూపమైన) గోత్వము మొదలగునది అనువృత్తిని కలిగియుండుట, రెండవది మొదలగు పిండగ్రహణములయందు తెలియఁబడఁదగినది. కావు

నట్టి రెండవది మొదలగు పిండగ్రహణములు సవికల్పకములు-సాస్న (గంగడోలు) మొదలగు వస్తువుల సంస్థానమయిన (సంనివేశమయిన) గోత్వము మొదలైనవి అనువర్తించుట మొదటి పిండగ్రహణమున గ్రహింపఁబడకపోవుటవలన మొదటిపిండగ్రహణము నిర్వికల్పకము గాని, సంస్థానరూపమైన జాతిటొత్తిగా గ్రహింపఁబడకపోవుటవలనఁ గాదు-సంస్థాన రూపమైన జాతియును ఇంద్రియములచేత గ్రహింపఁబడునది యెయగుటనును, సంస్థానము తప్ప సంస్థానముకలది మాత్రము తెలియఁబడుట సంభవింపకపోవుటనను, మొదటి పిండగ్రహణమునఁ గూడ సంస్థానముతోఁగూడనే ఇట్టున్నదని వస్తువు గ్రహింపఁబడును-కాఁబట్టి రెండవది మొదలగు పిండగ్రహణములయందు సంస్థానంబున అదిగలదియును గ్రహింపఁబడినట్లు అనువృత్తితోఁగూడియుండుట గూడ నెల్లప్పుడును గ్రహింపఁబడుచుండును గాన సవిసవికల్పకము లె- కాఁబట్టి ప్రత్యక్షమెప్పుడును విశేషములు లేనివస్తువు విషయముగాఁగల్ది కాదు-

౭. ఇందువలననె అంతటను భిన్నాభిన్నత్వము (భిన్నమగుటయు అభిన్నమగుటయును) కలదనుటయును త్రోసివేయఁబడినది- ఇదియిట్టున్నది అని తెలియుటలో ఇదంభావంబును (ఇదియగుటయును) ఇత్థంభావంబును (ఇట్టిదగుటయు) అట్టివానికి ఐక్యము (ఒకటియగుట) ఎట్లు తెలియ శక్యమగును?- అందు ఇత్థంభావమనునది సాస్న మొదలగు సంస్థానవిశేషము-దానికి విశేష్యమగు (ఆధారమైన) ద్రవ్యమే ఇదమ్ (ఇది) అనెడి యంశము-కాఁబట్టి వీనికి ఐక్యమనునది ప్రతీతినిపట్టియె (జ్ఞానమునాకారమునుపట్టియె) కొట్టఁబడినది-అదియెట్లన్నను- మొదటనె వస్తువు తెలియఁబడుచున్నదె ఇతరములన్నిటికంటెను వేఱుగానె తెలియఁబడును-ఆ తెలియఁబడునది గోత్వము మొదలగు సంస్థానవిశేషములతోఁ గూడినదై ఇట్లున్నదిఅని తెలియఁబడునుగాన వ్యావృత్తి (వేఱుపాటు) నిశ్చయింపఁబడుచున్నది-విశేషణవిశేష్యభావముతోచిన పోటులనెల్లను వానికి (విశేషణవిశేష్యములకు) మిక్కిలి భేదము ఆ తెలియుటలోనె స్ఫుటమగును- అందు దండము (చేతికఱ్ఱ) కుండలములు, మొదలగునవి వేఱు సంస్థానము (ఆకారము) కలవైతనయందు (విశేష్యమందు) ఉన్నవై ఒకా

నొక్క-కాలమందును ప్రదేశమందును మఱియొక్క వస్తువునకుఁగూడ విశేషణములుగానుండును-గోత్వము మొదలగునవియు, ద్రవ్యములందుం డుటచేతనె పదార్థములై (ద్రవ్యము నాశ్రయింపక వేఱుగానుండనివై) ద్రవ్యములకువిశేషణములై యున్నవి- రెంటియందును (దండము మొదలగుదానియందును గోత్వము మొదలగుజాతియందును) విశేషణవిశేష్యభావము సమానమె- దాని భేదము తెలియఁబడుటయునందువలననె- ఇంత మాత్రమువిశేషములకు- వేఱుగానుండుటకును తెలియఁబడుటకును తగినవి దండము మొదలగునవి- గోత్వము మొదలగునవియో (జాతులో), నియతముగావానికి (వేఱుగానుండుటకును తెలియఁబడుటకును) తగనివి- కాఁబట్టి వస్తువిరోధము ప్రతీతిచేతనె పోఁగొట్టఁబడినదిఅనుట, ప్రతీతియొక్క ప్రకారమును అపలాపముచేసి చెప్పఁబడినది-ఇదిఇట్లు అని యెప్రతీతియొక్క ప్రకారము అందఱిచేతను నొప్పఁబడినది- ఈయంశము సూత్రకారునిచేఁగూడస్ఫుటముగానుపపాదింపఁబడినది-

౮. (౨॥౨॥౩౧॥) నైకస్మిన్నసంభవాత్ (జైనమతముయుక్తము కాదు- ఒక్కదానియందు కలిమిలేమియనెడు రెండును సంభవింపక పోవుటవలన)

౯. ఇట్లు ప్రత్యక్షము సవిశేషవిషయమగుటను, ప్రత్యక్షము మొదలగువానిచేఁదెలియఁబడిన సంబంధముతోఁగూడినదె విషయముగాఁ గలుగుటను, అనుమానముకూడ సవిశేషవిషయమె (నిర్విశేషవిషయము కాదు)-

౧౦ ప్రమాణముల లెక్కలో వివాదమున్నను అందఱునంగీకరించిన ప్రమాణములకు ఇదియె (సవిశేషమె) విషయముగాన ప్రమాణము చేతనునిర్విశేషవస్తువుసిద్ధింపదు-వస్తువున నుండెడి స్వభావవిశేషములచేత ఆవస్తువునె నిర్విశేషమని చెప్పుచు తల్లిగొడ్రాలను ప్రతిజ్ఞచేయుటయందువలెతనమాటలోనివిరోధమునుగూడ నెఱుంగఁడు-

౧౧. ప్రత్యక్షము సత్తనుమాత్రమె గ్రహించునదిగాన భేదమును గ్రహింపదనియు భేదము గూడ విమర్శించినచో నిలువదుగాన నిరూపింపశక్యముకానిదనియుఁజెప్పినది,-జాత్యాదులతోఁగూడిన వస్తువె ప్రత్యక్షమునకు విషయమగుటనును, జాత్యాదులె ప్రతియోగినిపట్టి కాము

గలిగియున్నవస్తువునకును తమకునుగూడ భేదవ్యవహారమునకు హేతువులగుటనున్ను, దూరముగాఁద్రోసివేయఁబడినది-

౧౨. ఇతరమైనదానివ్యవహారమునకు హేతువగునదితనవ్యవహారమునకుఁగూడ హేతువగుట జ్ఞానమునందును రూపాదులయందును మీచేనంగీకరింపఁబడినది- అట్లే భేదమునందుఁగూడ సంభవించును-కావుననేఅనవస్థయును అన్యోన్యాశ్రయంబునుగూడలేవు-ప్రత్యక్షజ్ఞానమొకక్షణమె యున్నదైనను ఆక్షణముననే వస్తుభేదము అనఁగావస్తుసంస్థాన రూపమైన గోత్వము మొదలగునది గ్రహింపఁబడునుగాన మఱియొక క్షణమున గ్రహింపఁబడవలసినదేదియును లేదు-ఇంతియెకాక ప్రత్యక్షము సత్తనుమాత్రమె గ్రహించినయెడను ఘటముకలదు, పటముకలదు, అనెడివిశిష్టమువిషయముగాఁగల జ్ఞానమువిరోధించును-సత్తమాత్రముకంటె మిగిలినదై వస్తుసంస్థానరూపమైనజాత్యాదికమేయైన భేదము ప్రత్యక్షముచేత గ్రహింపఁబడదేని గుఱ్ఱమునుగోరువాఁడు దున్నపోతునుజూచి యేలమఱలుచున్నాఁడు?-అన్నిజ్ఞానములయందును సత్తమాత్రమె విషయమయ్యెనేని ఆయాజ్ఞానముల విషయములతోఁజేరియున్నశబ్దములన్నియు ఒక్కొక్కజ్ఞానమందెవ్వేలతలంపఁబడవు?-ఇంతియెకాక గుఱ్ఱమునందును ఏనుగయందును జ్ఞానము ఒక్కవిధమేకాన ఈరెండుజ్ఞానములలోనను, తుదినికలిగినజ్ఞానము, గ్రహించినదానినె గ్రహించునదియగుటనును విశేషమేమియును లేకపోవుటనును స్మృతి(ఒకపర్యాయము గ్రహించిన దానిని తలంచుట) కంటె విలక్షణము కాకపోవలసివచ్చును-ప్రతిజ్ఞానంబునకును విశేషమునొప్పినచో ప్రత్యక్షమువిశిష్టమైన (సవిశేషమైన) విషయమునెగ్రహించునని యొప్పికొనుటయగును- అన్నిజ్ఞానములకు నొక్కటియె విషయమైనయెడను ఒకజ్ఞానముచేతనే యంతయును గ్రహింపఁబడునుగాన గ్రుడ్డివాఁడు చెవిటివాఁడు అనునవిలేకపోవలసివచ్చును—సన్మాత్రము చక్షుస్సుచేత గ్రహింపఁబడునని చెప్పశక్యముకాదు- అది రూపము, రూపముకలది, రూపముతోఁగూడనుండునవి, అనువానినిగ్రహించును—త్వగింద్రియము చేతనును గ్రహింపఁబడదు-దానికిస్పర్శము(చల్లదనము వేడి మొదలగునవి)గలవస్తువువిషయము— శ్రోత్రము(చెవి)మొ

దులగు నింద్రియములును సన్మాత్రమును గ్రహింపవు-అవిశబ్దము(ధ్వని),రసము(రుచి),గంధము (వాసన),అనెడివిశేషములె విషయములుగాఁగలవి—కాఁబట్టి సత్తనుమాత్రము గ్రహించున దొకటియు వీనిలోఁ గానంబడదు- నిర్విశేషసన్మాత్రము (విశేషములేమియులేనిదై సత్తుమాత్రమైయైనది)ప్రత్యక్షముచేతనె గ్రహింపఁబడినయెడను, నిర్విశేషసన్మాత్రమును తెలియఁజేసెడిఆగమము(వేదము)ప్రాప్తవిషయము (మఱియొకదానిచేఁదెలియఁబడినవిషయముకలది) అగుటచేనను వాదకము కావలసివచ్చును- (అనువాదకమనఁగా మఱియొకదానివలనఁ దెలియఁబడినదానిని తెలియఁజేయునది-విధాయకమనఁగా మఱిదేనివలనను దెలియఁబడని క్రొత్తవిషయమును తెలియఁజేయునది)-ఇదిగాక సన్మాత్రబ్రహ్మముప్రమేయము (తెలియఁబడునది) కావలసివచ్చును- ప్రమేయమైనయెడను జడంబును నశించునదియును కావలసి వచ్చునని నీచేతనే చెప్పఁబడినది-కాఁబట్టి వస్తుసంస్థానరూపమైన జాతిమొదలగు భేదములతోఁగూడినదియే విషయముగాఁగలది ప్రత్యక్షము-

౧౩. అనేకవిషయములయందు ఒకటేయాకారముగల బుద్ధిచేత తెలియఁబడునది సంస్థానముకాక మఱియేదియును కనఁబడకపోవుటవల్లనున్ను, దానివలననె గోత్వము మొదలగు జాతులవ్యవహారము కుదురుటవల్లనున్ను, వేఱుగాజాతియున్నదన్నను సంస్థానము నొప్పుక తప్పకపోవుటవల్లనున్ను, సంస్థానమెజాతి-సంస్థానమనఁగా తనకుమాత్రముగలస్వరూపము-కాఁబట్టి వస్తువునుపట్టి సంస్థానమునూహించికొనవలయును-

౧౪. జాతినిపట్టియె భిన్నము(వేఱు)అనెడివ్యవహారము సంభవించుటవల్లనున్ను,మఱియొకపదార్థము కనఁబడకపోవుటనున్ను, భేదముపదార్థాంతరమనువాఁడుగూడ దీనినొప్పుకొనుటవల్లనున్ను,గోత్వము మొదలగునదియె భేదము-అట్లు జాతిమొదలగునదియె భేదమయినయెడను ఆజాతిమొదలగునది తెలియఁబడినప్పుడు జాతివ్యవహరింపఁబడునట్లు భేదముగూడవ్యవహరింపఁబడవలయునే యనినను- అవును-వ్యవహరింపఁబడుచునేయున్నది-గోత్వము మొదలగుదానిని వ్యవహరించుటలేదా?-గోత్వము మొదలగునదియేకదా మిగిలినయన్నిటికం

టెనుమవ్యావృత్తి- గోత్వము మొదలగునది గ్రహింపఁబడెనేని మిగిలిన వానియన్నిటితో సజాతీయమని తెలియఁబడుటయును వ్యవహరింపఁబడుటయును కలుగదుగదా- భేదజ్ఞానముచేతనేకదా అభేదము నివర్తించుట (పోవుట)- ఇదిదీనికంటె భిన్నము (వేఱు) అనివ్యవహరింపవలసినప్పుడు మాత్రము ప్రతియోగియపేక్షకలదుగాన భిన్నమనేడి వ్యవహారము ప్రతియోగినిపట్టి యుండునని చెప్పఁబడినది-

౧౫. ఘటము మొదలగు విశేషములు వ్యావర్తమానములు (మాఱునవి) గాననపరమార్థములు అనిచెప్పినది,- బాధ్యబాధకభావము (ఒకటిబాధింపఁబడునదియు మఱియొకటి బాధించునదియునగుట), వ్యావృత్త్యనువృత్తులు (నివర్తించుట,అనువర్తించుట),వీనివిశేషములనాలోచింపక భ్రమముచేత కల్పించికొనినది- రెండుజ్ఞానములకు విరోధము గలిగినంగదా బాధ్యబాధకభావము- బాధింపఁబడినదానికే వ్యావృత్తి (నివర్తించుట)- ఇచ్చట ఘటపటాదులకు దేశకాలభేదమునుపట్టి విరోధమెలేమ- ఏదేశమున నేకాలమున దేనికలిమి తెలియఁబడినదో,ఆదేశముననాకాలమున దానిలేమి తెలియఁబడెనేని,అప్పుడు, వానికివిరోధముగాన బలవత్తైనది బాధించునదియగుటయు, బాధింపఁబడినది నివర్తించుటయునుకలుగును- ఒక్కదేశముతోనును ఒక్కకాలముతోనును చేరనదిగాఁదెలియఁబడుచున్నదానికి మఱియొక్క దేశమందును మఱియొక్క కాలమందును లేకపోవుట తెలియఁబడుటలో విరోధము లేమగాన, ఇచ్చట బాధ్యబాధకభావమెట్లు?- ఒక్కచోటలేనిది మఱియొక్కచోట లేకపోవుటయెట్లుచెప్పఁబడును?- రజ్జుసర్పము (త్రాటినిపామయనుకొనఁబడినసర్పము) మొదలగుదానియందో, ఆదేశమందె ఆకాలమందె లేకపోవుట తెలియఁబడుటను విరోధంబు బాధకత్వంబును (బాధించునదియగుటయు) వ్యావృత్తి (నివర్తించుట) యునుకుదురుచున్నవి- కాఁబట్టి ఒక్కదేశంబునను నొక్కకాలంబునను గనఁబడినది మఱియొక్క దేశమందును మఱియొక్క కాలమందును లేకపోవుటమిథ్యాత్వమును (అపారమార్థికత్వమును) సాధించునదిగాఁగనఁబడకున్నదిగాను వ్యావర్తమానత్వము (నివర్తించునదియగుట) మాత్రము అపారమార్థికత్వమునకు హేతువుకాదు-

౧౬. అనువర్తించుచున్నదగుటను సత్తుపరమార్థము(సత్యము)అని చెప్పినది, రెండుమతములయందును సిద్ధమైకాన సాధింపఁదగదు-కాఁబట్టి సత్తుమాత్రమైన వస్తువు కాదు-

౧౭. అనుభూతికి నిర్విశేషంబునకును విషయవిషయిభావముచేత(సవిశేషము విషయమగుటయు అనుభూతి దానిని విషయముగాఁగలదియగుటయు ననుదానిచేత) భేదము ప్రత్యక్షసిద్ధమై బాధింపఁబడుట లేమిగాన అనుభూతియె సత్తుఅనునదియు నిరసింపఁబడినది-

౧౮. అనుభూతిస్వయంప్రకాశము(తనంతనె తెలియఁబడునది) అని చెప్పఁబడినది- విషయము ప్రకాశించునప్పుడు జ్ఞాత(తెలిసికొనువాఁడు)యగు నాత్మకు స్వయంప్రకాశమే- అందఱకు నెల్లప్పుడునట్టిది కావలయునను నియమము లేదు- పరానుభవము(ఇతరుని జ్ఞానము)హానము అనఁగా ఒకదానివిడుచుట, ఉపాదానము అనఁగా ఒకదానిని స్వీకరించుట మొదలగులింగములు అనఁగా హేతువులుగల అనుమానజ్ఞానమునకు(ఊహకు)విషయమగును- తనకుఁగలిగిన జ్ఞానము గూడ గతించెనేని తెలిసికొంటిని అను జ్ఞానమునకు విషయమగుట కానఁబడుచున్నది-కాఁబట్టి అనుభూతియయ్యేనేని స్వతస్సిద్ధముగానె యుండవలయునను నియమము లేదు-

౧౯. అనుభూతి తెలియఁబడునేని అనుభూతి కాకపోవలసివచ్చుననునదియు లెస్స గాదు-అట్లయినచోఁ దనకు కలిగి గతించిన యనుభవములును పరులయనుభవములును తెలియఁబడునవి గాన అనుభూతులు కాకపోవలసివచ్చును-ఇతరుని యనుభవమును అనుమానము చేయుటను(ఊహించుటను)అంగీకరింపనియెడను శబ్దమునకును దాని యర్థమునకును గల సంబంధమెగ్రహింపఁబడకపోవలసివచ్చుటచే శబ్దవ్యవహారములన్నిటికిని భంగము వచ్చును- ఆచార్యుఁడు జ్ఞానవంతుఁడని యూహించి ఆతని నాశ్రయించుట జరుపఁబడుచున్నది. అది కుదరదు-విషయమయినంతమాత్రముననె అనుభూతి కాకపోవుట లేదు-అనుభూతిత్వమనఁగా తానున్నప్పుడు తన యునికిచేతనె తన యాధారమునకు (ఆత్మకు) తెలియఁబడుట-తానున్నంతమాత్రముననె తన విషయములను దెలిసికొనుటకు సాధనమగుటయైననగును- మఱియొకరి యనుభవముచేఁ దెలియఁబడినను

ష్పటికిని ఈ రెండును అనుభవసిద్ధములై యున్నవిగాని లేకపోవుటలే దు- కావున అనుభూతిత్వము లేకపోదు- ఘటాదులు అనుభూతికాకపో వుట ఈ చెప్పినస్వభావము లేకపోవుటనె-అనుభవింపఁబడుటవలనంగా దు-ఇది గాక అనుభూతి అనుభవింపఁ బడదన్న చో నెయనుభూతికాకపోవ లసివచ్చుటతప్పదు-గగనకుసుమము (వట్టియాకాశమునఁబూసినపూవు- అనఁగా సంభవింపనిదనుట) మొదలగునవి అనుభవింపఁబడనివై యను భూతికాకపోవుట కానఁబడుచున్నది-గగనకుసుమము మొదలగునవిఅ నుభూతికాకపోవుట అసత్త్వము (లేనిదగుట) వలనవచ్చినదిగాని అనుభ వింపఁబడకపోవుటవలనఁగాదంటివేని,ఘటాదులుగూడననుభూతికాకపో వుట అజ్ఞానమునకు విరోధింపనివగుటవలనఁగాని తెలియఁబడుట వలనఁగాదని యొప్పుకొనవలయును-అనుభూతి తెలియఁబడునేని ఘటా దులకువలెనే దానికిని అజ్ఞానమునకు విరోధికాకపోవుట తటస్థించు నంటివేని,అనుభవింపఁబడనిదైనను గగనకుసుమాదులవలెన జ్ఞానము నకు విరోధికాకపోవుట ప్రసక్తించును-కాఁబట్టి తెలియఁబడునేని యను భూతికాకపోవలెననునదినవ్వఁదగినమాట-

౨౦ సంవిత్తు (జ్ఞానము) స్వతస్సిద్ధమగుటనుప్రాగభావము మొ దలగునవి లేవుగానపుట్టుక లేదని చెప్పుట,గ్రుడ్డివాఁడు పుట్టుగ్రుడ్డి వానికి కన్నులందిచ్చినయట్లున్నది-ప్రాగభావమును గ్రహించునది లేదు గాన ప్రాగభావము లేదని చెప్పశక్యము కాదు-అనుభూతిచేత ప్రాగ భావము గ్రహింపఁబడుచునేయున్నది-ఉన్నదైన యనుభూతి విరుద్ధ మైనతనయభావమును అకాలమందె ట్లు తెలియఁజేయునంటివేని,- అనుభూతితనతో సమానకాలమైనదానినె గ్రహించునను నియమము లేదుగదా- ఆనియమమున్న చో గతించినవియు కాఁగలవియు విషయము లు కాకపోవలసివచ్చును- ఒకరిప్పు డిట్లనుకొనిరెదవు- అనుభూతి యొక్క ప్రాగభావము మొదలగునవి తెలియఁబడునెడల సమాన కాలములై యుండవలయునని- ఇట్టినియమమును నీవు చెప్పుటకు నీ వుచెప్పుటనైననిట్లుతెలిసికొని యుంటివా?-నీవట్లు తెలిసికొని యుండు టకె ప్రాగభావము విషయమైనదిగానమేము చెప్పినది లేదనశక్యము కా దు-వస్తువుతో సమానకాలముగాఁ బ్రాగభావముండునని చెట్టివాఁడుకా

నివాఁడెవ్వఁడుచెప్పును?- తనతోసమానకాలమైన పదార్థమునే గ్రహించునను నియమము ఇంద్రియములవలనఁగలిగెడి ప్రత్యక్షజ్ఞానమునకే- అన్నిజ్ఞానములకును అన్నిప్రమాణములకునీనియమములేదు-స్మరణము(తలంపు),అనుమానము (ఊహించుట),ఆగమము(శబ్దప్రమాణము),యోగులప్రత్యక్షము,ఇవి మొదలగువానియందు కాలాంతరమునందున్నవి గూడ తెలియఁబడుట కానఁబడుచున్నది-దీనినిబట్టి యెప్రమాణమునకు ప్రమేయముతోనవినాభావము-అనఁగా ప్రమాణములు ప్రమేయమును విడిచియుండకపోవుట-ప్రమాణము తనతోసమానమైనకాలములోనున్నదానితోనవినాభావముకలదగుట అర్థసంబంధము అనఁగాప్రమేయములతోసంబంధించియుండుటకాదు-మఱేమన్నను,-ప్రదేశకాలములతోసంబంధించినదిగా,నేవస్తువు తెలియఁబడునో,ఆవస్తువునకు అట్టియాకారమె మిథ్యకాకపోవుట-అనఁగా నసత్యముకాకపోవుట-దీనివలననెస్మృతికివిషయములేదనుటయు నిరసింపఁబడినది-స్మృతికి విషయములేదనుటకు ఇతరమతస్థులవాక్యము —స్మృతిర్న బాహ్యవిషయానష్టే ప్యర్థేస్మృతిదర్శనాత్ అని-(దీనియర్థము-నశించిన విషయమునఁగూడస్మృతికలుగుచున్నదిగాన వెలుపలివస్తువులు స్మృతికివిషయములుకావు)

౨౧. ఇఁకనుఇట్లందువు,సంవిత్తు(జ్ఞానము) యొక్క ప్రాగభావము తత్కాలముననుండునది కాదుగాన ప్రత్యక్షముచేఁదెలియఁబడునదికాదు,లింగము (హేతువు) మొదలగునవి లేవుగాన మఱియొక్క ప్రమాణముచేతనను దెలియఁబడునదిగాదు, సంవిత్ప్రాగభావమునకు వ్యాప్యమైన అనఁగా అదియున్నచోటతప్పకుండనుండెడి లింగముఅనఁగా హేతువుకానఁబడదు,అనుపపత్తియును (అసందర్భమును)ఎవ్వనికినికానఁబడదు, దానింగుఱించినయాగమము (శబ్దప్రమాణముకూడ) చూడఁబడియుండలేదు,కాఁబట్టి ప్రమాణములేకపోవుట నెసంవిత్ప్రాగభావముసిద్ధింపదు,అని-ఇట్లు స్వతస్సిద్ధత్వమనెడివైభవమును విడిచి, ప్రమాణములేకపోవుటలోనికి దిగితివేని యోగ్యానుపలబ్ధిచేతనె అభావముసమర్థింపఁబడినదిగాన ఇఁకనీవు చాలింపుము.[యోగ్యానుపలబ్ధియనఁగా ఇచ్చటవస్తువుండునేని కనఁబడవలసినది, అట్లు కనబఁ

డుట లేమిగాన వస్తువు లేదు-అనఁగా వస్తువుయొక్కయభావము(లేమి)కలదనుట-యోగ్యముఅనఁగా కనఁబడఁదగినది-దానియొక్క అనుపలబ్ధి అనఁగాకనఁబడకపోవుట-ఇదియె అభావమును తెలిసికొనుటకు సాధనము]

౨౨. ఇంతియె కాక, ప్రత్యక్షజ్ఞానము, తనకు విషయమైన ఘటము మొదలగుదానిని, తానున్నప్పుడె ఉన్నదానిగాఁ దెలియఁజేయుచున్నదిగాన ఎల్లప్పుడును విషయమునునికిని దెలియఁజేయుట లేదు-కాఁబట్టి ఘటము మొదలగునది జ్ఞానమునకు వెనుకను తరువాతను ఉండుటను తెలియఁజేయదు- అట్లు తెలియఁజేయకపోవుట జ్ఞానముకొంతకాలమె ఉండునదిగాఁ గనఁబడుటవలన- ఘటాదులనుగూర్చిన జ్ఞానమె కాలనియమము లేక తెలియఁబడునేని ఆజ్ఞానమునకు విషయమైన ఘటము మొదలగునదిగూడ కాలనియమము లేక తెలియఁబడినదై నిత్యము కావలసివచ్చును- జ్ఞానము నిత్యమే యయి స్వతస్సిద్ధమైన యెడను నిత్యమనియె తెలియఁబడవలయును- అట్లు తెలియఁబడుట లేదు- ఇట్లు అనుమానాది జ్ఞానములుగూడ కాలనియమము లేక తెలియఁబడునేని తమవిషయములనుగూడ కాలనియమము లేనివానిగానె తెలియఁజేయునుగాన ఆవిషయములన్నియుఁగూడ కాలనియమము లేనివై నిత్యములు కావలయును-విషయములు జ్ఞానమునకుతగిన స్వరూపముగలవగుటయిందుకు హేతువు- విషయములేని జ్ఞానము ఎచ్చటనును కనఁబడుట లేదు- విషయములను ప్రకాశింపఁజేయు (తెలియఁజేయు) స్వభావము కలదిగాఁ దెలియఁబడుట లేకదా జ్ఞానమునకు స్వయంప్రకాశత్వము సమర్థింపఁబడినది- జ్ఞానము విషయములను దెలియఁజేసెడి స్వభావము లేనిదయ్యెనేని స్వయంప్రకాశత్వము సిద్ధింపదు-జ్ఞానము మఱియొక్కయనుభవమునకు విషయము కాదన్నచో జ్ఞానము తుచ్ఛమె(లేనిదె) కావలసివచ్చును-నిద్ర. మదము (మత్తెక్కుట), మూర్ఛ (సొమ్మసిల్లుట), మొదలగువానియందు విషయములెవ్వియు లేనిదై వట్టిజ్ఞానమె స్ఫురించునని చెప్పుటకు యోగ్యానుపలబ్ధి బాధకము- ఆదశలలోఁగూడ తెలివికలదేని మేలుకనినప్పుడు వానితలంపుండవలయును- అది లేదు-తెలియఁబడిన పదార్థమెల్ల స్మరింపఁ (తలంపఁ) బడవలయునను

నియమమ్ము లేదే, కాబట్టి స్మరణము(తలంపు) లేకపోవుట తెలివి లేకపోవుట నెట్లు సాధించును? అని శంకింపంబనిలేదు-సంస్కారములను(జ్ఞాపకము నివ్యవహరింపఁబడునది సంస్కారము) అన్నిటిని పోఁగొట్టెడి మరణము(శరీరముపోవుట) మొదలగు ప్రబలములైన హేతువులు లేకపోయినను గూడ స్మృతి(తలఁపు) లేకపోవుట తెలివి లేకపోవుటనే సాధింపుచున్నది గాని తలంపు లేకపోవుట మాత్రమే తెలివి లేకపోవుటను సాధింపదు- నిద్రపోయి లేచినవాఁడు ఇంతకాలంబును దేనిని నెఱుంగకుంటిని అనియెయనుకొనునుగదా-అనుభవము(తెలివి) ఉన్నను దాని తలంపు(స్మరణము) లేకపోవుట, విషయావచ్ఛేదము(విషయసంబంధము) లేకపోవుటవల్లనైనను, అహంకారము (నేను అనుకొనుట) లేకపోవుటవల్లనైనను అని చెప్పశక్యముకాదు- తెలియఁబడిన యొక్క వస్తువు తలంపు లేకపోవుటకు మఱియొక్క వస్తువు తెలియఁబడకపోవుటయైనను లేకపోవుటయైనను కారణముకాదు- ఆదశలయందుఁగూడ అహమ్(నేను) అనునంశము కలిగియెయుండుననిచెప్పఁబడఁగలదు

౨౩. అయితే నిద్ర మొదలగువానిలోఁగూడ విశేషములతోఁగూడినయనుభవము కలదని చెప్పఁబడెనే?-అవును-చెప్పఁబడినది- అది ఆత్మానుభవము -అది సవిశేషమె యని స్థాపించెదము-ఇప్పుడు విషయములెవ్వియు లేని నిరాశ్రయమైన జ్ఞానము నిషేధింపఁబడుచున్నది- వట్టి జ్ఞానమె ఆత్మానుభవమనుట సరికాదు- ఆత్మానుభవము ఆశ్రయము(ఆధారము) కలదని యుపపాదింపఁగలము-

౨౪. కాఁబట్టి యనుభూతి యున్నదై తాను తన ప్రాగభావమును సాధింపదు(తెలియఁజేయదు) గాన ప్రాగభావము సిద్ధింపదనఁగూడదు- అనుభూతి(జ్ఞానము) తెలియఁబడునది యగుట సంభవించుననుట చే మఱియొక్కదానివలన సిద్ధింపకపోవుటయు నిరసింపఁబడినది-కాఁబట్టి ప్రాగభావము మొదలగునవి సిద్ధింపకపోవుటనుబట్టి జ్ఞానమునకు పుట్టుకలేదనుట యుపపన్నము(యుక్తిసిద్ధము) కాదు-

౨౫. దీనికి పుట్టుక లేకపోవుటను మిగిలిన వికారములు లేవనుటయు నయుక్తము-ఎట్లంటేని—ఈ నియమము ప్రాగభావమును వ్యభిచరించినది-ప్రాగభావమునకు పుట్టుక లేకపోయినను నాశము కలదు-భా

వములలోనని విశేషణము వేసినయెడను తత్త్వమున[illegible] కటనకాఁగలదు- అట్లు మీరంగీకరించిన యవిద్యపుట్టుకలేనిదై యనేకవికారములుకలదై తత్త్వజ్ఞానము పుట్టినతోడనె కడతేరునుగాన దానియందుఁగూడ నీవుచెప్పనయీనియమముతప్పినది- దానివికారములు మిథ్యాభూతములంటివేని, నీకుపరమార్థమైన వికారముకూడనొకటికలదా!- అట్లయినచో నీవుచెప్పినది కార్యకరమగును- దానినిమీరొప్పుటలేదే-

౨౬. అనుభూతి(జ్ఞానము)పుట్టుకలేనిదిగానతనలో విభాగమును సహింపదనుటయును యుక్తముకాదు- పుట్టుకలేనియాత్మ, శరీరములుఇంద్రియములు మొదలగువానింబట్టి విభజింపఁబడుచున్నదికాదా- అనాదిగామీరొప్పుకొనినయవిద్య ఆత్మకంటెవేఱుఅనుటకు ముఖ్యముగా నొప్పవలసినదే- ఆవిభాగము మిథ్యారూపముగదా యంటివేని, పుట్టుకనుపట్టి యున్నపరమార్థమైనవిభాగమునీకెక్కడనైనసుకనఁబడినదా!- అవిద్యఆత్మకంటెపరమార్థమునవేఱుకాకపోయినయెడను అవిద్యయెయాత్మకావలసివచ్చును- బాధకమేమియులేని జ్ఞానమువలన సిద్ధించినదృశ్యముల (విషయముల)భేదమును సమర్థించుటవలన దర్శన(జ్ఞాన)భేదముకూడ సమర్థింపఁబడినదే- భేదింపఁబడునవిభిన్నములగుటవలనభేదించుటలు భిన్నములగునట్లు-

౨౭.. జ్ఞానముజ్ఞానస్వరూపమగుటనె తెలియఁబడెడిధర్మమెద్దియునులేదనియు, అవితెలియఁబడుటనె జ్ఞానమునకు ధర్మములుకావనియుఁజెప్పిననియమము వ్యభిచరించుచున్నది (తప్పిపోవుచున్నది)- ప్రమాణసిద్ధములై మీచేతనే యంగీకరింపఁబడిన నిత్యత్వము స్వయంప్రకాశత్వము మొదలగుధర్మములు జ్ఞానమునకుఁగలవు- అవియునుజ్ఞానమాత్రమేయనఁగూడదు- ఎందువల్లనంటేని స్వరూపము వేఱుగానున్నది- తానున్నంతమాత్రమున చేతనయాశ్రయమునకు(ఆధారమునకు)విషయములను ప్రకాశింపఁజేయునదికదా జ్ఞానము- స్వయంప్రకాశత్వమనఁగాతనసత్త(ఉనికి)చేతనేతనయాశ్రయమునకు ప్రకాశించుచుండుట- ప్రకాశమనఁగా చేతనాచేతనపదార్థములన్నిటికినిగలవ్యవహారానుగుణ్యము(వ్యవహరింపఁదగియుండుట)- నిత్యత్వమనఁగానన్ని

కాలములయందునుండుటకదా- ఏకత్వమనఁగా ఏకసంఖ్యకలిగియుండు
ట(ఒక్కటియై యుండుట)- ఇవిజడత్వాద్యభావరూపములు(జడత్వ
ము మొదలగునవి లేకపోవుటస్వరూపముగాఁగలవి)అయినను,అట్టివియై
చైతన్యమునకు(జ్ఞానమునకు)ధర్మములుగూడనైనవీనింబట్టియు,అనైకాం
త్యము(వ్యభిచారము) తప్పదు-జ్ఞానమునందు స్వరూపముకాక జడ
త్వాదులకు విరోధియగుటయనెడి అభావరూపమైనను భావరూపమై
ననయ్యెడిధర్మమునంగీకరింపనియెడను,నిషేధమును చెప్పుటవలననేమియు
ను చెప్పఁబడినయట్లు కాకపోవును-

౨౫ ఇంతియెకాక సంవిత్తు(జ్ఞానము)సిద్ధించునా లేదా- సిద్ధిం
చినయెడను ధర్మముతోఁగూడినదగును. లేనిచో గగనకుసుమము మొద
లగుదానివలె తుచ్ఛము(లేనిది)కావలసివచ్చును-సిద్ధియెజ్ఞానమని యె
డను ఎవ్వనికిదేనింగూర్చిన సిద్ధియో చెప్పవలయును-ఒక్కనికొక్క దానిఁ
గూర్చి కానిచో,నది సిద్ధికాదు-సిద్ధియనునది పుత్రత్వమువలెనొక్క దా
ని కొక్కదానింగూర్చియైయుండును- ఆత్మకు సిద్ధియంటిలేని ఆయా
త్మ ఏది?-జ్ఞానమేయని చెప్పితిమేయన్నను-అవును- చెప్పితిరిగాని అదిఆ
యుక్తముగాఁజెప్పినది-ఒక్కపురుషునకు ఒక్కపదార్థమును (విషయ
ను)గూర్చినసిద్ధియగుటను వానిసంబంధముగల యాజ్ఞానము స్వయ
ముగానాత్మయెట్లగును?-

౨౬.. ఫలితార్థము-అనుభూతియనునది,తనయాశ్రయమును గూ
ర్చి తానుకలిగియుండుటనే • ఒక్కవస్తువును వ్యవహరింపఁబడఁదగిన
దానిగాఁజేసెడి స్వభావముగ్గలదై, జ్ఞానము అవగతిసంవిత్తు మొద
లగు నామాంతరములుకలదై సకర్మకమైన(కర్మముతోఁగూడిన) అనుభ
వించువాఁడగు నాత్మయొక్కధర్మవిశేషము- అది,ఘటమహంజానామి
(కుండను నేను తెలిసికొనుచున్నాను) ఇమమర్థమవగచ్ఛామి (ఈవిష
యమును తెలిసికొనుచున్నాను) పటమహంసంవేద్మి (బట్టను నేను తె
లిసికొనుచున్నాను) అనియిట్లు ఆత్మసాక్షికముగానే ప్రసిద్ధమైనది-
ఇట్టిస్వభావము కలిగియుండుటనే యదిస్వయంప్రకాశమని నీవు
గూడ నుపపాదించితివి- కర్మముతోఁగూడినదై కర్తయొక్కధర్మవిశే
షమైన (ఒక్కధర్మమైన) యిది,కర్మమగుటవలె కర్తయగుటయు

నుమ్మక్షటమె(కుదురనిదియె)-

౩౦. ఎట్లన్నను-ఈకర్త స్థిరముగానుండుటయును, కర్తయొక్క ధర్మమైన జ్ఞానమునకు సుఖదుఃఖాదులకువలె పుట్టుటయును ఉండుటయును నశించుటయు ననెడిధర్మములును, ప్రత్యక్షముగాఁజూడఁబడుచున్నవి- అందుకర్త స్థిరముగానుండుట,ఆయీవిషయమె ముందునాచేననుభవింపఁబడినదను ప్రత్యభిజ్ఞా ప్రత్యక్షముచేత సిద్ధించినది-(ప్రత్యభిజ్ఞయనఁగానానవాలు పట్టుట)-నేను తెలిసికొనుచున్నాను, నేను తెలిసికొంటిని, తెలిసికొనుచున్నాకె ఇప్పుడుజ్ఞానము నశించినది,అని జ్ఞానమును త్పత్తి మొదలగునవి ప్రత్యక్షసిద్ధములై యెయున్నవిగానవాని కైక్యమెట్లు?-ఇట్లు క్షణమునశించెడి జ్ఞానమునే యాత్మయనియంగీకరించినయెడను వెనుకటిదినమున చూచినదానింగూర్చి టనినినేనుచూచితిని అనిమఱుఁగాదుకలిగెడి ప్రత్యభిజ్ఞయును కుదురదు- ఒకఁడనుభవించినదాని ప్రత్యభిజ్ఞ మఱియొకనికి సందర్భింపదు-

౩౧. ఇంతియెకాక అనుభవమునె యాత్మగా నంగీకరించినయెడను ఆదినిత్యమైనను ప్రతిసంధానము (ప్రత్యభిజ్ఞ)సంభవింపకపోవుటతప్పదు.ప్రతిసంధానమనునది, నేనెదినినిమునుపుగూడ ననుభవించితినని పూర్వాపర కాలములనుండెడి (గడచినకాలమందును దానితరువాతికాలమందునుండెడి)అనుభవించువానింగూర్చమాపునుగాని అనుభూతినిమాత్రమెకాదు-నీవుఅనుభూతి అనుభవించునది యగుటయుప్పటుకాదు- అనుభూతి అనుభూతిమాత్రమెకదా-ఆశ్రియము లేకవిషయమును లేకయుండెడిసంవిత్తనునది ఎచ్చటనును బొత్తిగాకనఁబడకపోవుటవలన సంభవింపదనిచెప్పయేయున్నాము-మనమిద్దఱమునంగీకరించినసంవిత్తు (జ్ఞానము)ఆత్మయనుట ప్రతీతివలన నెపోఁగొట్టఁబడినది- అనుభూతియె పరమార్థమనుటకుఁజెప్పినతప్పుహేతువులన్నియుఁగూడ నిరాకరింపఁబడినవి-

౩౨. అహంజానామి(నేనెఱుంగుచున్నాను)అనెడి అస్మత్ప్రత్యయమున(నేననెడిజ్ఞానమున)ఇదిఅనెడియంశముగాని దై ప్రకాశైకస్వరూపమైనచైతన్యమనెడి పదార్థమెఆత్మ, దానిలోనెఆచైతన్యబలముచేత ప్రకాశించెడిదగుటచే యుష్మదర్థమైన అహంజానామి( నేనుతెలి

కొనుచున్నాను) అనెడియహంశబ్దార్థము జ్ఞానమాత్రముకన్న భిన్న
మైనది, అని యద్వైతులు చెప్పుదురు- అదియుక్తము కాదు- అహం జానా
మి (నేను తెలిసికొనుచున్నాను) అనునప్పుడు అహమ్ అనుశబ్దార్థము తె
లివి కలదియనియు, తెలివి దానికి ధర్మమనియు, ప్రత్యక్షముగాఁ దెలియఁ
బడుచున్నది- ఇంతియె కాక, అహమ్ (నేను) అనుశబ్దమునకు ఆత్మయర్థము
కానియెడను ఆత్మ ప్రత్యక్కు కాకపోవలసివచ్చును- (ప్రత్యక్కనియు పరా
క్కనియు రెండువిధములగు వస్తువులు కలవు- అందు ప్రత్యక్కనునది తన
కు తానె ప్రకాశించునది- పరాక్కనునది మఱియొకదానికి తాను ప్రకా
శించునది) అహమ్ (నేను) అని తెలియఁబడుట నేకదా ఆత్మ పరాక్కు కాక
ప్రత్యక్కగుట- మోక్షమునుగోరువాఁడు నేను నాదుఃఖములన్నియు పోయి
అంతములేని యానందమును పొందిస్వయముగా ప్రకాశించువాఁడ
ను కావలయుననికదా శ్రవణము మొదలగుదానియందు ప్రవర్తించును-
అహమ్ (నేను) అనెడివస్తువు నశించుటయె మోక్షమని తెలిసికొను
నేని మోక్షప్రసక్తికైనను పోవఁడు- నేను నశింతును, నాకంటె నితరమైనజ్ఞా
నము ఉండును, అని తెలిసికొని, దానిం బొందుటకు ప్రయత్నము నెవ్వఁడు
ను చేయఁడు- ఈజ్ఞానము తనసంబంధము కలదియగుటనె ఉండుటయును
జ్ఞానమనఁబడుచుండుటయును- తనతో సంబంధము లేనిచో జ్ఞానమె సిద్ధిం
పదు- ఛేదించువాఁడును ఛేదింపఁబడుటయును లేనిచో ఛేదించుట సిద్ధిం
పనియట్లు- కాఁబట్టి తెలిసికొనువాఁడై అహమ్ (నేను) అని చెప్పఁబడు
వాఁడె ప్రత్యగాత్మయని నిశ్చయింపఁబడినది-

౩౩. ఆత్మ జ్ఞానమాత్రముకాఁడనియు జ్ఞానము కలవాఁడనియు
ఈ క్రింది శ్రుతిస్మృతులవలనఁ దెల్లంబగును-

(బృ॥౬॥౫॥౧౫॥) విజ్ఞాతారమరే కేన విజానీయాత్ (ఓసీ- తెలి
సికొనువానిని దేనిచేత తెలిసికొనవలయును)

(బృ॥ ) జానాత్యేవాయం పురుషః॥ (ఈపురుషుఁడె
తెలిసికొనుచున్నాఁడు)

(భ॥గీ॥౧౩॥౧॥) ఏతద్యోవేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః
(ఈశరీరమును ఎవ్వఁడు తెలిసికొనుచున్నాఁడో వానిని క్షేత్రజ్ఞుఁడ
ని వానినెఱింగినవారు చెప్పుచున్నారు)

సూత్రకారుఁడును(||౨||౩||౧౮||) నాత్మా శ్రుతేర్నిత్యత్వాచ్చ తాభ్యః(ఆత్మపుట్టువాఁడుకాఁడు-నజాయతే=పుట్టఁడు అని శ్రుతి యుండుట వలన-ఆశ్రుతులవలననె నిత్యుఁడు కూడనగుటవల్లను)అని మొదలు పెట్టి—(||౨||౩||౧౯||) జ్ఞోతఏవ (ఇందువలననె ఆత్మజ్ఞానముకలవాఁడు)అని చెప్పును-

౩౮. అహమ్(నేను)అనెడి జ్ఞానముచే సిద్ధించునదిగదా యహమర్థము- యుష్మత్ప్రత్యయముచే(నీవనెడి జ్ఞానముచే) సిద్ధించునదిగదాయుష్మదర్థము- ఇట్లుండఁగా అహంజానామి(నేను తెలిసికొనుచున్నాను)అనెడిజ్ఞానముచే సిద్ధించెడి తెలిసికొనువాఁడు యుష్మదర్థమనిచెప్పుట, నాతల్లి గొడ్రాలు అనునట్లు అసందర్భమైనది- అహమ్(నేను)అని చెప్పఁబడెడి జ్ఞాతమఱియొకరిదానివలనఁబ్రకాశించువాఁడుకాఁడు-స్వయంప్రకాశుఁడు- జ్ఞానస్వభావము కలుగుటగదా స్వయంప్రకాశత్వము- ఏది ప్రకాశించుట (తెలియఁబడుట)స్వభావముగాఁగలదో యది ఇతరమునకధీనమైన ప్రకాశముకలది అనఁగా మఱియొకరిదానివలనఁ బ్రకాశించునది కాదు-దీపమువలెనే-దీపము మొదలగునది,తన వెలుగువలనఁ బ్రకాశించుటనుపట్టి,ప్రకాశము లేనిదగుటయు ఇతరాధీనప్రకాశముకలదిఅనఁగా మఱియొకరిదానివలనఁ బ్రకాశించునది యగుటయును,లేదు-మఱేమన్నను,- దీపము ప్రకాశస్వభావమైతనంతనె ప్రకాశింపుచున్నది-తన వెలుగుచేత మిగిలినవానింగూడ ప్రకాశింపఁజేయుచున్నది-

౩౯. ఫలితార్థము-తేజోరూపమైన ద్రవ్యమొకటియె వెలుఁగుగానును వెలుఁగుకలదిగానునుండును-వెలుఁగునది వెలుఁగుకల ద్రవ్యము నాశ్రయించియున్నదైనను తేజోద్రవ్యమేకాని తెలుపు మొదలగుదానివలెగుణముకాదు- తనయాశ్రయముకంటెమిగిలినదానియందు గూడ నుండుటయును రూపముకలిగియుండుటయు నందుకు హేతువులు- తెలుపు మొదలగుదానివంటిదికాకపోవుటయును ప్రకాశము (వెలుగు) కలదగుటనును తేజోద్రవ్యమెకాని మఱియొకటి వస్తువుకాదు-అదిప్రకాశముకలదగుట, తనస్వరూపమునును మిగిలినదానిని ప్రకాశింపఁజేయునదియగుటను-ఎల్లప్పుడును దానినాశ్రయించియుండుటనునుదా

విశేషము (అంగము) అగుటను దీనిని గుణమని వ్యవహరించుట-ఆధారము అనఁగా దీపము మొదలగు దాని యవయవము లేవిడినవై సంచరింపుచు వెలుఁగని చెప్పఁబడును అనుట సందర్భింపదు-అట్లైనచో వెలుఁగు గలవైనమణి (రత్నము), సూర్యుఁడు, మొదలగునవి నశింపవలసివచ్చును-దీపమునందుఁ గూడ అవయవి అనఁగా జ్వాలకనఁబడుట లేకపోవలసివచ్చును-విడిపోయెడి స్వభావముగల యవయవములతోఁ గూడిన దీపములు నాలుగంగుళములు మాత్రము తప్పక చేరియున్నవై పైకి వెడలియటపైనొక్క-పర్యాయమె అడ్డముగానును మీఁదుగానును క్రిందుగానును ఒక్క-విధముగానె విడినవై సంచరింపుచున్నవని చెప్పశక్యము కాదు-ఇందువలన ప్రభ (వెలుఁగు) తోఁ గూడినవేరైన దీపములు క్షణక్షణము పుట్టుచున్నవై నశింపుచున్నవని, సమృద్ధిగల కారణములు కలిగినచోఁ గలుగుటను పట్టియును, అవి నశించినచో నశించుటను పట్టియును, ఊహింపఁబడుచున్నది- ప్రభకుతనయాధారము దగ్గరను వెలుతురును వేడియును హెచ్చుగానుండుటయును అట్లు ప్రత్యక్షమగుటనే యేర్పడుపఁబడవలసినది-అగ్ని మొదలగు దానికి వేడి మొదలగు దానివలెనే-ఇట్లె ఆత్మయును జ్ఞానస్వరూపుఁడై జ్ఞానము గుణముగాఁ గలవాఁడు-జ్ఞానస్వరూపుఁ డగుట యొకదా స్వయంప్రకాశత్వము.

౩౬. అట్లు శ్రుతులు గూడఁ జెప్పుచున్నవి-

(బృ॥౬॥౫॥౧౩॥) సయథా సైన్ధవఘనో౽నన్తరో౽బాహ్యః కృత్స్నో రసఘన ఏవైవం వా అరే౽యమాత్మా౽నన్తరో౽బాహ్యః కృత్స్నః ప్రజ్ఞానఘన ఏవ (ఓసీ! ఎట్లు ఉప్పుగడ్డ వెలుపలి భాగంబును లోపలి భాగంబునంతయును ఉప్పదనపు గడ్డయె యగునో, ఇట్లు వెలుపలి భాగంబును లోపలి భాగంబును అంతయును జ్ఞానపుగడ్డయె.)

(బృ॥౪॥౪॥౧౩॥) విజ్ఞానఘన ఏవ- (జ్ఞానమె స్వరూపముగాఁ గలవాఁడు)

(బృ॥౬॥౩॥౯॥) అత్రాయం పురుషస్స్వయం జ్యోతిర్భవతి (ఇచ్చటను ఈ జీవుఁడు స్వయంప్రకాశుఁడగుచున్నాఁడు)

(బృ॥౬॥౩॥౩౦॥ నవిజ్ఞాతుర్విజ్ఞాతేర్విపరిలోపో విద్యతే- (తెలిసికొనువాని జ్ఞానమునకు లోపము లేదు-)

(ఛా॥౮॥౧౨॥౪॥) అథ యో వేదేదం జిఘ్రాణీతి స ఆత్మా (ఇఁక నెవ్వఁడు ఇదిదీని వాసన చూచుచున్నానని యెఱుంగునో వాఁడు ఆత్మ)

(బృ॥౪॥౩॥౭॥) యోయం విజ్ఞానమయః ప్రాణేషు హృద్యన్తర్జ్యోతిః పురుషః (జ్ఞానము విస్తారముగాఁ గలవాఁడై ప్రాణములయందును హృదయములోపలను ప్రకాశస్వరూపుఁడెవ్వఁడో-)

(ప్రశ్నో॥౪॥౯॥) ఏష హి ద్రష్టా --- శ్రోతా ఘ్రాతా రసయితా మన్తా బోద్ధా కర్తా విజ్ఞానాత్మా పురుషః (ఈ పురుషుఁడు అనఁగా జీవుఁడు, చూచువాఁడు --- వినువాఁడు, వాసనచూచువాఁడు, రుచిచూచువాఁడు, తలంచువాఁడు, తెలిసికొనువాఁడు, పనిచేయువాఁడు, జ్ఞానస్వరూపుఁడు-)

(బృ॥౪॥౫॥౧౫॥) విజ్ఞాతారమరే కేన విజానీయాత్ (ఓసీ, తెలిసికొనువానిని దేనిచేతఁ దెలిసికొనవలసినది-)

(బృ॥ ) జానాత్యేవాయం పురుషః (ముక్తిని పొందిన యీ జీవుఁడు తెలిసికొనుచునే యున్నాఁడు)

(ఛా॥ ) న పశ్యో మృత్యుం పశ్యతి న రోగం నోత దుఃఖతామ్ (భగవంతుని జూచువాఁడు మృత్యువును చూడఁడు-రోగమునును చూడఁడు-ఇంతియె కాక దుఃఖమునును చూడఁడు)

(ఛా॥౮॥౧౨॥౩॥) స ఉత్తమః పురుషః --- నోపజనం స్మరన్నిదం శరీరమ్ (ఆతఁడు అనఁగా నీశ్వరుఁడు ఉత్తముఁడైన పురుషుఁడు-- పుట్టిన యీ శరీరమును స్మరింపుచునుండఁడు)

(ప్రశ్నో॥౬॥౫॥) ఏవమేవాస్య పరిద్రష్టురిమాః షోడశ కలాః పురుషాయణాః పురుషం ప్రాప్యాస్తం గచ్ఛన్తి (ఇట్లు ఈ యనుభవించువానియొక్క ఈ పదియాఱు కళలును భగవంతుని కధీనములుగాన భగవంతుని పొందిన పైని నశింపుచున్నవి-పదియాఱు కళలెవ్వి యనఁగా- ౧ ప్రాణము ౨ ఆస్తిక్యబుద్ధి ౩ ఆకాశము ౪ వాయువు ౫ తేజస్సు ౬ ఉదకము ౭ భూమి ౮ వాక్కు మొదలగు నింద్రియములు ౯ మనస్సు ౧౦ అన్నము ౧౧ శరీరేంద్రియముల సామర్థ్యము ౧౨ తపస్సు ౧౩ మంత్రములు ౧౪ కర్మములు ౧౫ స్వర్గాదిలోకములు ౧౬ స్వర్గాదినామములు అనునవి)

(తై॥౨॥౪॥౧॥) తస్మాద్వా ఏతస్మాన్మనోమయాత్ । అన్యోఽన్తర

ఆత్మావిజ్ఞానమయః (ఆయీమనోమయకోశముకంటెనితరుఁడైదాని లోపలనుండువాఁడు జ్ఞానము విస్తారముగాఁగలవాఁడైనజీవుఁడు) ఇవి మొదలగునవి-

౩౭. సూత్రకారుఁడును (॥౨॥౩॥౧౮॥) జ్ఞోతఏవ (శ్రుతినిబట్టియె ఈజీవుఁడు తెలిసికొనువాఁడు గాని తెలివిమాత్రము కాఁడు-)

౩౮. ఇందువలన స్వయం ప్రకాశుఁడైన ఈయాత్మజ్ఞాతయె (తెలిసికొనువాఁడె)-ప్రకాశము(తెలివి)మాత్రముకాఁడు- ప్రకాశమనునది యొకదానింగూర్చినదైయుండవలయును- దీపము మొదలగుదాని ప్రకాశము(వెలుఁగు)వలెనే-కాఁబట్టి సంవిత్తు(తెలివి)ఆత్మకాఁదు గదు-సంవిత్తు,అనుభూతి,విజ్ఞానము,మొదలగు శబ్దములు సంబంధిశబ్దములు అనిశబ్దార్థములనెఱింగినవారుచెప్పుదురు (అన్న,తమ్ముఁడు, తండ్రి, అన్నప్పుడు ఎవ్వనికిఅన్న? అనిఇట్లు వానిసంబంధము కలవానియాకాంక్షకలుగునట్లు జ్ఞానముఅనఁగానె,దేనిజ్ఞానముఅనునాకాంక్షతప్పకపుట్టును- ఇట్టిశబ్దములుసంబంధిశబ్దములు) -లోకమునందుఁగాని,వేదమునందుఁగానిజానాతి(తెలిసికొనుచున్నాఁడు)అనునది మొదలగు క్రియలు కర్మలేకకానీకర్తలేకకానీ ప్రయోగింపఁబడుట కానంబడినదా?-

౩౯. జడుఁడుగాఁడుగానఆత్మ,సంవిత్తె(జ్ఞానమె)అనిచెప్పినచోట నొకటియడుగవలసియున్నది-అజడత్వమనఁగా నేమియనిమీతాత్పర్యము?-తనసత్తను(ఉనికిని)బట్టియె ప్రకాశించుటయన్నచో దీపాదులయందును ప్రసక్తించును-సంవిత్తు(జ్ఞానము)కంటెనతిరిక్తమైన ప్రకాశమనెడి ధర్మమునంగీకరింపకపోవుటచేత,మీరుచెప్పినయిది సిద్ధింపకపోవుటయు,నిర్విశేషత్వంబునకు విరోధంబునుగూడకలుగును- ప్రకాశమును(తెలియఁబడుటను)తప్పనిసత్త(ఉనికి)కలిగియుండుట యనునదిసుఖాదులయందుఁగూడకలదు గాన నదియజడత్వమనశక్యముకాదు- సుఖాదులుతప్పకుండెడి ప్రకాశము(తెలియఁబడుట)కలవైనను,మఱియొకనికి ప్రకాశించునవిగాన,ఘటాదులవలెనే జడములగుటను ఆత్మకాదు,అయినచో, జ్ఞానము మాత్రము తనకు ప్రకాశింపుచున్నదా? అదియును [illegible] మ్ (నేను) అనఁబడెడి తెలిసికొను వానికి

# ప్రకటనము.

ఫెల్లో ఆఫ్ది యూనివర్సిటీ, రాయబహదర్, అను బిరుదములు గల మహారాజశ్రీ వల్లూరి జగన్నాథరావుపంతులుగారిచే ఆంధ్రశాంకరకమను పేర శ్రీమచ్ఛంకరభగవత్పాదవిరచితంబగు బ్రహ్మసూత్రభాష్యము తెనుగు చేయఁబడి దానిలోని ప్రథమపాదము ముద్రింపఁబడినది.

దానిని చూచిన రెవిర్ శ్రీ రాజా గోడె నారాయణగజపతిరాయనింగారు చిత్తగించి శ్రీభగవద్రామానుజాచార్యవిరచితంబగు శ్రీభాష్యమునుగూడ తెనుగుగా రచియింపవలయునని సెలవిచ్చినందున ఈయాంధ్రశ్రీభాష్యము రచింపనారంభింపఁబడినది.

ఇది జిజ్ఞాసువులందఱకును లభించుటకై శ్రీరాజాగారిసెలవుప్రకారము ముద్రింపఁబడుచున్నది.

ఇది నెల ౧కి ౪౮ పేజీలుగల సంచికలుగాఁ బ్రకటింపఁబడును.

దీనిచందా.

| | |
|---|---|
| ౬ మాసములకు పోస్టేజితో | ౧-౬-౦ |
| ౧ సంవత్సరమునకు ,, | ౨-౧౦-౦ |

విశాఖపట్టణము } ఆర్షముద్రాశాల }

శ్రీపరవస్తు శ్రీనివాసజగన్నాథస్వామి అయ్యవారలుగారు

ఈయాంధ్రశ్రీభాష్యమునకు చందాసు ఇచ్చినవారలు—

| | |
|---|---|
| మ-రా-రా-శ్రీ | రు- అ- పై |
| ద్వారం వెంకటనరసయ్యనాయఁడుగారు | ౨- ౧౦- ౦ |
| న్యాయపతి శ్రీమన్నారాయణస్వామిపంతులుగారు | ౨- ౧౦- ౦ |

## సర్వాస్తికమతోపయుక్తములగు గ్రంథములు.

దివానబహదూర్ శ్రీరాజా గోడే నారాయణగజపతిరాయనింగారి
సెలవుప్రకారము ముద్రింపఁబడినవి.



రు- ౦- ౩ ఉపనిషత్సారగీతములు-ఇవి సదరు శ్రీరాజాగారియొక్క శ్రేశారమువారికి అనాదిగా మతగ్రంథోపదేశకసంతతివారైన మహామహోపాధ్యాయ శ్రీపరవస్తు వెంకటరంగాచార్యులయ్యవారలుంగారిచే రచింపఁబడినవి. ఇవి తారకకృతులు-వీనికి రాగములు సుతాళములును మొదట వేయఁబడియున్నవి. మంచి కాకితముల మీఁద ముద్రింపఁబడియున్నవి - Demy 12 L.o 38 pages-

రు- ౦- ౨ పరమేశ్వరసహస్రనామములు- ఇవి దివానబహదూర్ శ్రీరాజాగారి సెలవుప్రకారము శ్రీపరవస్తు శ్రీనివాసభట్టనాథాచార్యులయ్యవారలుంగారిచే శివవిష్ణ్వాదిసహస్రనామములనుండి సంగ్రహింపఁబడి, కఠినములైన నామముల యర్థములు గూడ మంచి కాకితములమీఁద ముద్రింపఁబడినవి-Demy 16 mo 24 pages.